శ్రీ ర స్తు.

# వా సి ష్ఠ రా మా య ణ ము.

ద్వి ప ద కా వ్య ము

తరిగొండ వెంగమాంబకృతము.



చె న్న పు రి :

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్సువారిచే

ప్ర క టి త ము.

1925

శ్రీ ర స్తు.

# వా సి ష్ఠ రా మా య ణ ము

## ద్వి ప ద కా వ్య ము.

శ్రీవిఘ్ననాథుని క్షేత్రపాలకుని
శ్రీవాణినీ విరించిని హయాననుని
నలఘుదుర్గను జౌడమాంబను శివుని
నల వరాహస్వామి నాత్మయందుంచి
భక్తిచే నెపుడు సుబ్రహ్మణ్యగురుని
ముక్తిప్రదుని పాదముల నాశ్రయించి
మురిసి నవగ్రహమ్ములకుఁ గేల్మోగిచి
ధరణిమీఁద మదాత్మ తరియించుకొఱకు
సామోదమతిని సుజ్ఞానవాసిష్ఠ
రామాయణార్థసారమును గ్రహించి
వరుసగా ద్విపదకావ్యముగా రచించి
యెరలేక మీకు సమర్పింతు నిపుడు
శ్రీతారకోల్లాస శ్రీశ్రీనివాస
శ్రీతరిగొండనృసింహ ధూతాంహ

విన్నవించెద నేను విన్నఁ డదెట్లనిన
మున్ను భరద్వాజమునిపుంగవుండు
మోక్షేచ్ఛ నిజచిత్తమునఁ బ్రకాశింప
వేక్షణభక్తిని బ్రియము రెట్టింప
వరవిరక్తిని బొంది వాల్మీకిమౌని
చరణాంబుజములకుఁ జాఁగిలి మ్రొక్కి
వినుతులు పెక్కు గావించి యిట్లనియె
ఘనమునీశ్వర మీరు కరుణించి నాకు
వేదశాస్త్రాదిసద్విద్య లన్నియును
భేదంబు లేకుండఁ జెప్పి ప్రోచితిరి
మనుజులు సంసారమాయాబ్ధి దాఁటి
సునిశితముక్తి హెచ్చుదఁ బొందుసరణిఁ
దెలుపవే యనుచుఁ బ్రార్థింప వాల్మీకి
యలభరద్వాజున కప్పు డిట్లనియె
వత్స భరద్వాజ వసుధ నందఱిని
వాత్సల్యమునఁ బ్రోచు వైపు భావించి
యతిరహస్యప్రశ్న మడిగితి వార్య
హిత మొప్పఁ జెప్పెద నెట్లన్న వినుము
పుట్టి గిట్టుచునున్న భూప్రజలందు
నెట్టన నెవరైన నిఖిలభోగములు
నిరసించి వైరాగ్యనిష్ఠ పెంపెసఁగ
నెరయ సంసారంబు నిత్యంబు గాదు

తను వశాశ్వతమ సిద్ధముగ నే నెవఁడ
నని విచారించి దీనార్తుఁడై తనకు
నీరహస్యముఁ జెప్ప నిష్టుఁడై నట్టి
కారణగురుఁ డెందుఁ గలుగునో యనుచుఁ
బొరిపొరి దీనార్తుఁడై నట్టి సత్య (1)
నరునకు గురుభక్తి నాఁటుఁ జిత్తమున
నాభక్తి దృఢముగా నాత్మనుంచుకొని
ప్రాభవంబుల కాశపడక కామాది
వైరుల ఖండించి వాంఛల విడిచి
యాథార్థుఁడైన మహాగురుస్వామిఁ
జేరి శుశ్రూషలు చేసినఁ బుణ్య
సారవిహీనసంసారాబ్ధి దాఁటి
రమణీయమోక్షతీరమునందుఁ జేరి
యమల సద్వస్తునందైక్యమై నిలుచు
ధరణి నజ్ఞుండైనఁ దజ్ఞుండునైన
నిరవొందఁ దన్నుఁ దా నెఱిఁగెడికొఱకు
సదమలగురుసేవ సల్పఁగావలయు
నది మానిరేని మోక్షార్థులు గారు
ఆకాశమందు నైల్యాదివర్ణములు
జోకగాఁ గనుపించి శూన్యంబులైన
కరణిఁ జిద్వ్యోమప్రకాశంబునందుఁ
బొరిపొరి భూతముల్ పుట్టి నశించు

నట్టి మిథ్యారూపమైన ప్రపంచ
మెట్టిదని మది నూహింపంగ నీక
పటుజాగ్రత్తా భ్రాంతిభ్రమలఁ బుట్టించు
నటువంటి భ్రమకు లోనై చెడిపోక
మదిలోన తద్భ్రాంతి మఱచుటె లెస్స
యదె చూడు దృశ్యంబు లన్ని దబ్బఱలు
గానుండి యజ్ఞానకర్మదృక్కులకుఁ
బూని యప్పుడు నిజంబుగఁ గానవచ్చు
జ్ఞానదృక్కులకుఁ బ్రపంచము కానరాదు
మానితబ్రహ్మ మాత్మకు గోచరించుఁ
జిత్తవృత్తులు నశించిన జీవతత్త్వ
మత్తఱిఁ జిత్తులో నణఁకువై పొందు
నిటువంటి సూత్రార్థ మెఱుఁగ నేరకయు
ఘటికులై బహుకర్మకంధిలోపలను
బొరలుచుండెడివారు భూలోకమందుఁ
దఱుచైన గల్పశతంబులకైన
ముక్తిఁ బొందఁగలేరు ముక్తి యెట్లనిన
యుక్తితో వినుము చేయుచునుండు కర్మ
వాసనవాసమై వచ్చుచు లేని
యాసల కాస్పదంబైన పాపంబు
క్షీణించి పోవుటే చిరముక్తి యనఁగ
నాశమై తగువాసనలు నెట్టి వనిన

సరవిని మలినవాసన యదిగాక
సరసమౌ శుద్ధవాసనయు నీరెండు
అందు మలినవాస నజ్ఞానతమము
పొందుగాఁ దా నహంబు వహించి జన్మ
కారిణి యగుచు దుఃఖము నిచ్చుచుండు
సారమై శుద్ధవాసన పునర్జన్మ
కారిణి గా కహంకారబీజంబు
నారూఢిఁ గాల్చిన యానంద మిచ్చుఁ
దా నర్ధదేహంబు ధరియించియుండుఁ
గానఁ దజ్ఞయనంగఁ గర మొప్పుచుండు
ఘనశుద్ధవాసనకలితులు ధరణి
ననఁగ జీవన్ముక్తు లనఁగ నొప్పుదురు
అందు జీవన్ముక్తుఁ డగు పంక్తిరథుని
నందను కథ విన్న నరులకు జన్మ
మరణదుఃఖంబులు మాయు నారాము
చరితంబుఁ జెప్పెదఁ జక్కఁగా వినుము
అని పల్కు వాల్మీకి కంజలిఁ జేసి
మొనసి భారద్వాజముని భక్తినతనిఁ
గని రామచరితంబు క్రమముగా నాకు
వినుపింపవే యని విశ్వాస మొదవ
నడుగ భరద్వాజు నాత్మలో మెచ్చి
యడర వాల్మీకి యిట్లని చెప్పఁదొడఁగె

విను మో భరద్వాజ విబుధులఁ బ్రోవఁ
బనిఁబూని యాపరబ్రహ్మ మచ్యుతుఁడు
శ్రీవిష్ణుదేవుఁ డాశ్రితజనావనుఁడు
పావనాచారుండు భానువంశమునఁ
బొలుపొంద దశరథపుత్త్రుఁడై పుట్టి
తొలఁగక వృద్ధిఁ బొందుచునుండినపుడు
దేవత లతనిఁ బ్రార్థించి యిట్లనిరి
దేవాదిదేవ పృథ్విని నీవు మనుజ
దేహంబు ధరియించితివి మానవులను
మోహాబ్ధిలోఁ బడి మునిఁగి పోనీక
కడతేర్చు కారణకర్తవే యనఁగఁ

.... .... .... ....

నరయ వసిష్ఠసంయమి నాశ్రయించి
సరసవేదాంతవిజ్ఞానధర్మముల
వరుసగా నాలింపవలె నీవు పరమ
గురుఁడవయ్యును మదిఁ గొంకక యన్య

.... .... .... ....

గురు నాశ్రయించి యోగరహస్యమును
వినినను గొందఱావిధమున గురుని
ననుసరించి కృతార్థ లగుదురటంచు
బహువిధంబుల వారు ప్రార్థింపఁగాను
విదితంబుగా విని విజయరాఘవుఁడు

అనిమిషుల్ ప్రార్థించినందు కచ్చోట
తనమదిలో నిట్లు దలఁచె నాథునఁడు
దేహేంద్రియములు వృద్ధినిబొంది విషయ
వాహినిలోఁ ద్రోయఁవచ్చి హెచ్చినవి
మైత్రిని దొల్త నిమ్మాట్కిని జూపి
శత్రువై నటువంటి సంసారవార్ధిఁ
గడపట ముంచుచు గట్టెక్కనీక
విడఁబడి చెఱచు నీవిషయేంద్రియములు
కావున సకలభోగంబుల విడిచి
నే విరక్తిని జెంది నిస్పృహత్వమునఁ
బొందిన దశరథభూపతి చింత
నొందునో యనుభీతి యొక్కింత మదిని
బొడమఁగా నది మాని పుణ్యతీర్థములఁ
బొడగాంచి గ్రుంకుచుఁ బుణ్యాశ్రమములఁ
గనుఁగొని వచ్చి యక్కడనుండినట్టి
మునివృత్తు లాత్మ నిష్ఠుగ మెచ్చికొనుచు
నిజరాజ్యసౌఖ్యంబు నిరసించికొనుచు
సుజనసాంగత్య మచ్చుగఁ గోరికొనుచుఁ
గుజనులతోఁ జెల్మి కొఱగాదటంచు
విజనస్థలములందు వేఱె తా నుండి
యారసి తన్ను మోక్షార్హునిఁ జేయు
కారణగురు వెందుఁ గలుగునో యనెడి

చింతచే డస్సి యా శ్రీరామచంద్రుఁ
డంతఃపురంబులో నార్తుఁడై యున్న
వేళ గాధేయుండు విమలసత్కీర్తి
తాళిమితోఁ జేయఁదలఁచి వేడుకను
దా నయోధ్యకుఁ బోయి దశరథుచేత
నానందముగఁ బూజ లంది యామీఁద
గౌరవంబున మహీకాంతు నీక్షించి
ధీరత్వ మెసఁగఁ బ్రార్థించి యిట్లనియె
నరనాథ మత్సవనంబు రక్షింప
నరలేక శ్రీరాము నంపవే యనిన
విని పంక్తిరథుఁడు నిర్విణ్ణుఁడై పలికె
మునినాథ! యిపుడు రాముని బంపలేను
నేక్రమంబుననైన నీక్షణమందె
నీక్రతురక్షకై నేనె వచ్చెదను
అని పెక్కువిధముల నమ్మహారాజు
వినుపింప నమ్మునివిభుఁడు కోపించి
బహునిష్ఠురోక్తుల భాషింపఁ జూచి
మహిమ నొప్పు వసిష్ఠమౌని యానృపుని
గని యిట్టు లనియె నిష్కర్ష గా గాధి
తనయునివెంట నీతనయుని బంపు
మని యొప్పఁ జెప్పఁగా నాపంక్తిరథుఁడు
తనమది హర్షించి తదనంతరమునఁ

జారులఁ జూచి యచ్చోటికి మీ రరిగి
శ్రీరాముఁ దోడ్తెండు శీఘ్రంబుగాను
అన విని చారు లిట్లనిరి శ్రీరాముఁ
డెన లేనిచింతతో నెనయుచున్నాఁడు
సకలసుఖంబులు చాలించినాఁడు
వికలుఁడై నాఁడని విన్నవింపఁగను
విని నృపాలుఁడు చాల విన్ననై యతని
గనవలెఁ దోడ్తెండు గ్రక్కున ననఁగ
వేవేగ వారేఁగి విజయరాఘవున
కావార్త లెఱిఁగింప నందుండి లేచి
తా వచ్చి రాముఁ డాతండ్రికి మ్రొక్కి
దీవెన లంది గాధితనూభవునకు
మ్రొక్కి వసిష్ఠసన్మునికిని మ్రొక్కి
యక్కజంబగాను విశ్వామిత్రు చెంతఁ
జేరి చేతులు మోడ్చి శిర మర వంచి
యారాముఁ డాత్మీయం బార్తి వహించి
తనచింత రెట్టింపఁ దనువు గంపింపఁ
గనుల బాష్పము లొల్కఁగా దీనుపగిది
నున్నరామునిచంద మూహించి మౌని
యన్న రమ్మని పిల్చి యాదరింపుచును
దనువెల్ల నిమురుచుఁ దాప మొందుచును
ముని దయ మీఱ రామున కిట్టు లనియె

నాతండ్రి రఘువర నాటుగా నిపుడు
నీతండ్రి రాజ్యంబు నెమ్మదిగాను
బాలింప యువరాజ్యపట్టభద్రుండ
వై లలిసుఖములె ల్లనుభవింపకయు
యేలుకలు ద్రవ్విన యిట్టిచందమునఁ
గలఁగుచు దిగులందఁ గారణం బేమి
పట్టి నీయౌవనప్రాయంబునందు
నెట్టన సుఖముల నేఁ బొందవలయు
నట్టిచందము మాని యార్తి నొందితివి
యిట్టిమనోవ్యథ యేల జన్మించె
నని పెక్కువిధముల నమ్మునీశ్వరుఁడు
నెనరుతో నడుగఁగా నృపనందనుండు
మరల నంజలిఁ జేసి మౌని నీక్షించి
కరఁగుచు గద్గదకంఠుఁడై పలికె
మునినాథ! యీలోకమున మర్త్యవితతి
జనియించుచెల్లను జచ్చుటకొఱకె
చచ్చుచెల్లను మళ్లి జనియించుకొఱకె
హెచ్చుగా నిల్చుట స్థిర మెందు లేదు
అన్ని యస్థిరములై నట్టిచందంబు
మున్నుగాఁ దెలిసియు మూర్ఖత్వ మెసఁగ
మది రాజ్యసుఖమునం దల్లాడఁబోవు
నదిమి నిల్పిన నిలవ దాశతోఁ గూడి

యొక్కచోటున నిల్వ కురుకుచు నుండుఁ
జిక్కఁబట్టినగాని చెనఁటియై జరుగు
నిట్టిమదిని నిల్పు బెట్టని చింత
పుట్టిన దిదిగాక భూరిరాజ్యంబు
మొదలైనసంపదల్ ముందుగా సౌఖ్య
మిది యనిపించి దా హెచ్చి పిమ్మటను
మదమును బుట్టించి మాయాబ్ధి ముంచు
నదిగాక దేహేంద్రియాదిభోగములు
ఆదియం దమృతమ ట్లానంద మిచ్చి
యాదట గరళమై యతిభేద మిచ్చు
ఘనవిరాగము తొల్తఁ గష్టమై తోఁచి
యనుపమానానంద మయ్యుండు తుదను
నిది సుఖమో లేక నింద్రియభోగ
మది సుఖమో తెల్పుఁ డరమర మాని
నానావిధంబుల నాకుఁ జూచినను
జ్ఞానవైరాగ్యభాస్వరచింతనమున
నిఖిలభోగములను నిరసించు సరణి
సుఖమిచ్చునంచుఁ దోఁచుచు నున్న దిపుడు
తక్కిన యాశాస్పదంబు లన్నియును
గ్రక్కున లేనిదుఃఖము నిచ్చు బెట్ల
నన్నను విత్తంబు నాశచేఁ గూర్చి
యున్నవాఁ డేవేళ నులుకు నే లనిన

ధరణి తాదాఁచిన ద్రవ్య మెందున్న

.... .... .... ..

ముదమున పగతు లమ్ముఁగఁ బొంచిపొంచి
పొదివి యెక్కడఁ గొనిపోదురో యనుచు
నూరకే ధనవంతుఁ డులుకుచు నుండు
నారయఁగా వాని కది సుఖం బగునె
కదిసి యౌవనము సుఖం బిచ్చు ననిన
అది రక్తమాంసహేయాస్థిచర్మములు
గూడి రూపములైన బొమ్మలముఖము
లాడాడఁ జూచి మోహభ్రాంతి నొంది
తగఁ బెండ్లి యాడి విత్తము నపేక్షించి
మగఁటిమిఁ జూపుచు మదమత్తులైన
ధనికుల యాచించి ధనము లార్జించి
తనభార్య కొప్పించి తమకించి దాని
కలసి స్వతేజంబు కరఁగించి విడిచి
బలహీనుఁడై డస్సి పామరుం డగుచు
నందనులం గాంచి నాటుగాఁ బెంచి
యందున బహుసౌఖ్య మబ్బె నటంచు
మురిసి వారలమీఁద మోహంబు నుంచి
మఱిమఱి సంసారమాయలో మునిఁగి
సారార్థసరణి విచారింపఁ దనకుఁ
దీరక పగలు రాతిరి యదే జోలి

గా కాల మూరకే గడవుచునుండి
యీకాల మరుగఁగా నట జరాభార
కలితుఁడై రోగదుఃఖంబులచేతఁ
బలుమాఱు వగచుచుఁ బడి లేవలేక
దేహంబుపై నాశ దిగవిడలేక
మోహలోభములచే మూఢాత్ముఁడగుచుఁ
దరలి తాఁ బోయినఁ దనయు లిల్లాలు
వెరవక యెట్లు జీవింతురో యనుచుఁ
జింతింపుచుండఁగాఁ జేరువై మొనసి
యంతకాలము రాఁగ నట మృత్యుదేవి
జనులకుఁ బొడగట్టఁగా భీతి నొంది
తను దాని మఱవఁగా దండకింకరులు
స్థూలమందుండిన సూక్ష్మదేహమును
గాలపాశంబుతోఁ గట్టి గొంపోయి
మొనసి యాకాలుని ముందఱ నిడఁగఁ
గని యముఁ డాపాపకర్ము నచ్చోట
నారసి నిజకింకరాళి కొప్పించి
గారించి తగు నరకంబులలోను
బడవైచి కొన్నాళ్లు బాధించి చాల
బడలించి యట పుణ్యఫల మొకకొంత
గలిగియుండినను సుఖంబు నొందించి
బలములై తగు పుణ్యపాపశేషముల

తోడ ధారుణిమీఁదఁ ద్రోయింప మగుడి
వాఁడు దిగంబడి వాయుమార్గమున
జలదంబులోఁ జేరి జలరూప మొంది
మొలుచు సస్యములందు ముందుగాఁ జెంది
పటిమతో బీజరూపముల ధరించి
యటమీఁదఁ దా నన్నమై పూర్వఋణము
గలిగినపురుషుని గర్భంబుఁ జొచ్చి
యలవీర్యరూపమై యతివగర్భమునఁ
జేరి పిండంబై విచిత్రావయవము
లారూఢిఁ బొడమి తనోన్నసరింపకయు
గర్భగతజ్ఞానకలితుఁడై యచట
నర్భకుఁడై యుండి యలమటల్ పడుచు
వెడలుదారెఱుఁగక వివశుఁడై దుఃఖ
పడుచు నక్కడనుండి పదియవనెలను
ధరణిపైఁ బడి తనతల్లియుఁ దండ్రిఁ
బ్రియముతోఁ బోషింపఁ బెరుఁగుచునుండి (
యవల బాల్యావస్థ యౌవనావస్థ
లవని ననుభవించి యట వృద్ధుఁ డగుచు
భోగేచ్ఛఁ జేసిన పుణ్యపాపముల
తోఁ గూడి క్రమ్మఱఁ దొల్లిటివలెనె
పడిపోయి పుణ్యపాపఫలంబు లచటఁ
దడయక యంత మోదముల నియ్యఁగను

నాకనారకముల నవ్యభోగమును
శోకం బనుభవించు సాక్కి నుక్కినను
నెప్పటిరీతిగా నిలమీఁదఁ బుట్టు
నప్పుణ్యపాపంబులం దిందు నరుని
నెప్పుడు నెడఁబాయ కెల్లలోకముల
త్రిప్పుచె కాని ము క్తిని బొందనీవు
బావిలో నేతముబాన తా మునిఁగి
యావేళనే జలం బందుండి తాను
గొని తెచ్చి భూమిపైఁ గుమ్మరింపుచును
మొనసి క్రమ్మఱ నంద మునిఁగి లేచుచును
నుండుచందమున జీవుం డొకచోట
నుండక తిరుగుఁ గావున జన్మకర్మ
మరణదుఃఖముల వేమరుఁ బొందుచున్న
నరులను జూచితే నామది భీతి
పుట్టుచు నున్నది పుణ్యపాపములు
పుట్టువులకు హేతుభూతంబు లనుచుఁ
గడువడి నిటు కాలకర్మద్వయంబు
విడఁబడి పుట్టించు విధిరుద్రముఖుల
నడిపించుజగముల నానావిధములఁ
గడపట వరుసగాఁ గబళించు మరలఁ
బుట్టించుఁ ద్రుంచు నీభూరివిశ్వంబు
నెట్టనఁ గల్గి లేనిది యగుఁ దుదను

గావున నే రాజ్యకాంక్ష శీఘ్రముగఁ
బోవిడి ముక్తిని బొందెద నింక
నెక్కడిసంసార మెక్కడిఘోర
మెక్కడిజాడ యి దెక్కడిపీడ
కామాది రిపు లహంకారచిత్తములు
నామది మానసం బఖిలేంద్రియములు
విషయముల్ తమతమ వృత్తులతోడ
విషమగతుల మించి వేధింపసాగె
దానిచే హృదయంబు దందహ్యమాన
మైనది దాని చల్లార్చి మీ రెఱిఁగి
యున్న సుజ్ఞానంబు నుపదేశ మిచ్చి
నన్ను రక్షింపకున్నను భుక్తి విడిచి
పూని నే మీపదాంబుజములచెంత
మేను దొరఁగువాఁడ మీయాన యనుచు
ఫాల మామానీంద్రపదములమీఁదఁ
జాల హత్తించి బాష్పంబులు కనుల
వెడలుచు నుండఁగా వేఁడి నిట్టూర్పు
విడువఁగా నవ్వాని వేదనఁ బొంది
రాముని రెండుకరంబుల నెత్తి
ప్రేమతోఁ గూర్చుండఁ బెట్టి లాలించి
శిరమును జుబుకంబుఁ జెక్కిళ్లు నిమిరి
పరమార్థహృదయుఁడై పలికె నిట్లనుచు

నాయన్న రఘురామ నను గన్నతండ్రి
నీయాత్మ కడ తేరు నెళవు ముందుగను
నీయంతనే నీవు నిశ్చయించితివి
మాయాప్రపంచ యీమర్మంబు లన్ని
తెలిసితి వికఁ నుపదేశంబు చేయ
వలసినదేమి సర్వము నెఱుంగుదువు
కొదవ యేమన్నను గురుముఖంబుగను
విదితంబుగాఁ దత్త్వవిజ్ఞానసరణి
వినకయే తొలుతవివేకంబుచేత
ఘనవిరాగము నీకుఁ గలిగియుండియును
ననుమాన మొందితి వంతియే కాని
జనసుత నీకు మోక్షము గల్గు టరుదె
మహిని ముముక్షుధర్మము బాల్యమందె
సహజంబుగా నీకు సంభవించినది
యిపు డిందు కితిహాస మేను జెప్పెదను
నిపుణుండవై విను నీరీతి శుకుఁడు
మొనసి తనంతనే మోక్షధర్మముల
ననఘుఁడై తెలిసియు ననుమానమొంది
తనతండ్రియైన వేదవ్యాసుఁ జేరి
వినయంబుతో విన్నవించె నిట్లనుచు
జనక యీమాలినంపు సంసార మెచట
జనియించె నే మది సంసారవాంఛ

ముందటి గతియేమి మూఢసంసార
మెందు లయంబొందు నెఱిఁగింపుఁ డనుచుఁ
బాదపద్మములపైఁ బడి లేవకున్న
బాదరాయణుఁ డెత్తి పలికె నిట్లనుచు
వినుము పుత్త్రక స్వాత్మజ్ఞానసరణి
గను మాత్మబుద్ధివికల్పనచేతఁ
గలుగు విశ్వం బావికల్పనం బణఁగి
పొలిసినప్పుడు జగంబులు గానరావు
అవి గానరాకుండినపుడు సంసార
మెవరిదిగాక తా నెవుడో నశించు
నది నశించిన దేహమం దహంభావ
ముదయింప కణఁగిపోవుట ముక్తి యనుచు
వినుపింప నంతయు విని శుకయోగి
యనుమానమును వీడ కందున్నఁ జూచి
విని సంశయం బిందు విడువలే డనుచుఁ
దా నిశ్చయించి వేదవ్యాసుఁ డనియె (?)
శుక యింతకన్న హెచ్చుగ నే నెఱుంగ
నిఁక నీవు చని మిథిలేశ్వరుం డైన
జనకుని నడుగు నీసంశయం బతఁడు
సునిశితార్థముగఁ దీర్చును నీ వచటికిఁ
దప్పక పొమ్మంచు దయ దళుకొత్త
జెప్పిన మిథిలేశుఁ జేరె నాశుకుఁడు

అప్పు డానందమగ్నాత్ముఁడై లేచి
తెప్పున జనకుఁ డాధీరు నీక్షించి
హెచ్చుగాఁ బూజించి యిచటికి మీరు
వచ్చిన పని యేమి వరయోగిచంద్ర!
చెప్పుఁ డాపని నేను జేసెద ననఁగ
నప్పుణ్యుఁ డావ్యాసు నడిగినరీతి
జనకుని నడుగఁగా సంతసమ్మంది
విని యానృపాలుండు విశ్వాస మొప్పఁ
బలికె నిట్లనుచు నోపరమయోగీంద్ర!
సులలితచిత్పురుషుం డొక్కరుండు
దక్క నన్యము లేదు తత్త్వార్థ మింత
నిక్కంబు నీవు దీనికి సంశయింప
వల దాత్మసంకల్పవాంఛబంధంబు
వెలయు సంకల్పంబు విడుచుటే ముక్తి
యిది యథార్థము సంశయింపకు మీవు
మది దృశ్య ముడిగి సమ్మతిఁ బొందినావు
పదిలంబుగా నిదే పట్టి భావింప
మదియందె లయమొందు మఱిసంశయములు
నుదయింప వదియె మనోన్మని యగును
సదమలచరిత మోక్షం బిదే సుమ్ము
వేఱె మార్గము నింక వెదుకఁబోవలదు
భూరి సంతోషసంపూర్ణానుభవము

నొందు మంచు వచింప నుపొంగి శుకుఁడు
మందస్మితాస్యుఁడై మనుజనాయకుని
యానందముగఁ జూచి యరమర విడిచి
నానిశ్చయం బదే నాతండ్రి మొదట
చెప్పినయర్థమే సిద్ధంబుగాను
చెప్పితి పరమేశ చిత్తసంశయము
తీరె నంచు వచించి దిగ్గున లేచి
యారాజు సెలవంది యరిగె యొక్కెడను
బరమైన నిర్వికల్పసమాధినుండి
పరిపూర్ణుఁడై మోక్షపద మందె శుకుఁడు
అని చెప్పి దయను విశ్వామిత్రమౌని
మనుకులోత్తముఁ జూచి మరల నిట్లనియె
సకలజ్ఞ! శ్రీరామచంద్ర! తనంత
శుకుఁడు దెలిసినట్లు సూక్ష్మవిజ్ఞాన
సరణిఁ దెలిసి తీవు సంశయార్థముల
మెరమెరఁ బొంద నేమిటి కింకమీఁద
నరలేక యుపశాంతి యనెడుతోయమున
మఱవక యిపు డాత్మ మలినంబు గడిగి
భూరివిశ్రాంతిని బొంది సుఖింపు
మూరకె పరితాప మొంద నేమిటికి
నమర జ్ఞాతృజ్ఞేయమైన చిత్తరతి
క్రమ మొప్పఁగా సమగ్రంబగు భోగ

సముదయానుభవంబు శాంతమై లేక
శమమొందు దానిలక్షణ మదే యగును
విశ్వంబు సద్వస్తువే యగుఁ గనుక
నీశ్వరరూపమై యింపొందుచుండు
వరుస బంధము భోగవాసనచేత
నరిముఱి దృఢతరంబై వృద్ధిఁబొందు
జగతిఁ దద్భోగవాసన శాంతమైనఁ
దగిలియున్నట్టి బంధము విడిపోవు
నిన్ను నీ వెఱుఁగుచు నిఖిలరాజ్యంబు
పన్నుగా జ్ఞానివై పాలింపుచుండు
మని దృఢంబుగఁ జెప్పి యపుడు వసిష్ఠ
మునిని వీక్షించి రామునకు సత్కృపను
సలలితబుద్ధి విశ్రాంతివాక్యములఁ
దెలివిగా మీ రుపదేశింపుఁ డిపుడు
అనిన విశ్వామిత్రు నావసిష్ఠుండు
కనుఁగొని పూర్వ మాగాధిపుత్త్రుండు
తనకుఁ జేసినకీడు దలఁపక మౌని
యనుమతి వే శాంతుఁడై పూర్వ మజుఁడు
తనకుఁ జెప్పిన గూఢతత్త్వవాక్యముల
మొనసి తలంచి రామున కిట్టు లనియె
రామాభిరామ! యోరఘువంశసోమ!
ప్రేమఁ గౌశికుఁడు చెప్పినవాక్యములను

దగ వింటివై నను దదనుసారముగ
విగతసంశయముగా వినుపింతు వినుము
సారవిహీనసంసారంబునందు
పౌరుషంబునఁ బొందఁబడును సర్వంబు
విరివి పౌరుషమే ద్వివిధముగా నుండు
సరవి నుచ్ఛాస్త్రంబు శాస్త్రీతం బనఁగ
నందెన్న శాస్త్రీత మర్థసంప్రాప్తి
నొందఁజేయుచునుండు నుచ్ఛాస్త్ర మనెడి
గురుపౌరుషంబు మిక్కుటము తా నగుచుఁ
బరమార్థసౌఖ్యసంప్రాప్తి నొందించు
వదలకుండెడి పూర్వవాసనచేతఁ
బదపడి శాస్త్రీతపౌరుషం బొనర
జనియించినప్పు డీజగతి నుచ్ఛాస్త్ర
ఘనపౌరుషంబుచే గ్రక్కున దాని
నారూఢయుక్తిచే నడ్డపెట్టుచును
ధీరతఁ జిత్తశాంతిని బొందు మనఘ!
అనభిజ్ఞచిత్తుఁడై నటువంటివాఁడు
తనియక యజ్ఞానతప్తుఁడై యుండు
నెందాఁక నజ్ఞాన మిరవుగా నుండు
నందాఁక కర్మంబు లంటుచునుండు
నెందాఁకఁ గర్మంబు లెనయుచు నుండు
నందాఁకఁ బుట్టుచు నణఁగుచు నుండు

ఎందాఁక జన్మంబు లెత్తుచు నుండు
నందాఁక దుఃఖమగ్నాత్ముఁడై యుండుఁ
గావునఁ దద్దుఃఖకంధి దాఁటుటకు
నావయై యుండు జ్ఞానస్వరూపంబు
నిటువంటి జ్ఞానంబు నెఱిఁగెడికొఱకుఁ
బటుభక్తి దీపింపఁ బరమదేశికుని
సేవించి గురుశాస్త్రసిద్ధాంత మెఱిఁగి
జీవుండు మోక్షంబుఁ జెంది సుఖించు
నారీతిఁ గర్మమం దంటక నీవు
సారవిజ్ఞానలక్ష్యము నొందు రామ
తుదలేని సంసారదుఃఖంబు నణఁచి
సదమలబుద్ధి విశ్రాంతి నొందించి
సంతోషకరమగు సంపూర్ణతత్త్వ
మంతఃకరుణచేత నబ్జసంభవుఁడు
నా కుపదేశించినాఁ డాక్రమంబు
నీకుఁ జెప్పెద నన్న నెమ్మది నొంది
యావసిష్ఠుని జూచి యంజలిఁ జేసి
పావనాత్ముఁడు రామభద్రుఁ డిట్లనియె
నేకారణమునను నింద్ర పద్మజుఁడు
నీ కుపదేశించె నిశ్చితార్థములు
అనిశ్చితార్థ మె ట్లభ్యసించితిరి
దీనుఁడనగు నాకుఁ దెలుపవే యనిన

విని మునీంద్రుఁడు పల్కె విమలం బమృతము
ననఘం బనంతంబు నాదిమధ్యాంత
రహితంబు సర్వపూర్ణంబు నిత్యంబు
సహజంబు సత్యంబు సచ్చిద్ఘనము
శుద్ధచైతన్యంబు సుస్థిరతత్త్వ
సిద్ధాంతమై ప్రకాశించుచు నుండి
యెక్కడఁ జూచిన నెడ యింత లేక
యొక్కవస్తువు నిల్చియుండు నెప్పటికి
నది చంచలించియు నచల మాచోట
నుదయించె విష్ణుదేవుండు మహాత్ము
నదమల నాభికంజమున విరించి
సదయుఁడై జనియించి సకలభూతములఁ
బుట్టించె నతని తపోమహత్త్వమునఁ
బట్టుగా సర్వప్రపంచమ్ముఁ దెలిసె
సరసభారతవర్ష సంభవులైన
నరులు పామరులు నానావిధన్యాయ
కలితులు లోభులు కాముకుల్ జడులు
బలహీనులును మోహపరవశుల్ శఠులు
గురువంచకులును మూర్ఖులు దాంభికులును
పరధనాసక్తులు పరసతీరతులు
కావున బహునారకములందు మునిఁగి
పోవుదు రని తనబుద్ధి నూహించి

శోకింపుచుండెడి సుతులకై తాను
శోకించు జనకుని చొప్పున నజుఁడు
చింతించి జపహోమశీలధర్మములు
వంతుకెక్కిన తపోవ్రతముల జనుల
శాంతిని బొందింపఁ జాల వందఱికి
సంతోష మిచ్చు సుజ్ఞానం బటంచు
మది నిశ్చయించి సమ్మతముగా నన్ను
ముదమొప్పఁ దనమనంబుననె సృజించె
నపుడు బ్రహ్మజ్ఞాని నైనను బుట్టి
కపటప్రపంచసంగతులలోఁ జొరక
తెలివియై నను నేనె తెలియుచు నందు
వలన సద్గురుఁడు గావలె ననుచింత
నా కందు లేకయున్న విరించి చూచి
యీకుమారుఁడు తత్త్వ మిల తనంతటనె
తాను దెలిసి గురుత్వంబు నామీఁద
నూనికగా నిల్పుకున్నాఁడు గురుఁడు
చెప్పని సద్విద్య సిద్ధింప దనుచు
నప్పు డజ్ఞానివియై యిటుమీఁద
గురుభక్తి నెద నుంచికొని తత్కరుణను
మరల విజ్ఞానివై మహి నుండు మనుచు
శాప మియ్యఁగ బ్రహ్మసత్తను మఱచి
యాపట్ల నే నెవ్వ రైనది మదికిఁ

దోఁచక యుండఁగాఁ దోయజోద్భవుని
జూచి శుశ్రూష హెచ్చుగఁ జేసి మ్రొక్కి
నిలిచి నే నెవ్వరు నీ వెవ్వ రిపుడు
దెలుపవే సద్గురుదేవ! యటంచు
నేను ప్రార్థింప మన్నించి విరించి
తా నందు సద్గురుత్వమును వహించి
సరగున నాకు సంసారరోగంబు
హరియింప నౌషధంబైన జ్ఞానమును
దేఁటగాఁ దా నుపదేశంబుఁ జేసి
హాటకగర్భుఁ డిట్లనె నోకుమార!
యరుదుగా శ్రమకారి యగు క్రియాకాండ
కరుణతో బోధించు కర్మకారులకు
నది మాని వైరాగ్యమందుఁ జిత్తంబు
కుదిరించువారికిఁ గొంకక నీవు
నేను జెప్పిన జ్ఞాననిష్ఠ బోధించి
యానంద మొందించు మని చెప్పెఁ గనుక
రహి నొప్పు భూతపరంపరలందు
విహరించుచుండుదు విజ్ఞానపటిమ
వలనఁ గర్తృత్వాదివాంఛల విడిచి
యలుకక యూరకె యుండు నిద్రించు
వానికై వడి దేహవాసన మఱచి
మానసంబును గెల్చి మతి శాంతి నొంది

కర్మఠులకుఁ గ్రియాకాండ బోధింతు
నిర్మలవైరాగ్యనిష్ఠుల కెల్లఁ
దిరముగా జ్ఞానోపదేశంబుఁ జేతు
నరసి సంసారినై యుం దంటకుందుఁ
జేయఁగాఁ దగుపనుల్ చేసియు నొకటి
చేయనివాఁడనై జీవించుచుందు
గురి గానలేని మూర్ఖుండైనఁగాని
గురుసేవఁ జేసి యాగురుతరజ్ఞాన
సరణిని వినుచున్న సకలపాపములు
పారిపారి నశియించిపోవు పిమ్మటను
నరయ మేధాశాలియై గురుమర్మ
మెఱిఁగి ముక్తిని బొందు నినకులోత్తంస
సరససద్గురువాక్యసరణి సచ్ఛాస్త్ర
మరసి మనోనిశ్చయంబు నాత్మైక్య
పరుఁడైన పురుషుండు పరమందుఁ జెందు
ధరణీశ! వినుము తీర్థస్నానములును
మొనయఁ గాయక్లేశములు సతీసుతులు
ధనధాన్యములు దేవతాసేవనములు
పురుషుని ముక్తినిఁ బొందింపలేవు
తిరముగా మది నిరోధింపకుండినను
నది నిరోధంబగు నటువంటిరీతి
విదితంబుగా నీవు విను మదె ట్లనిన

నమలిన మోక్షగృహద్వారమందు
శమము విచారంబు సంతోష మలఘు
సాధుసాంగత్య మెంచంగ నీనాల్గు
బోధ శాకరములై పొసఁగుఁ బాలకులు
అందు శమం బెట్టి దన్నఁ జెప్పెదను
బొందుగా విను రామ! భూపాలవరులు
తను దిట్టునప్పుడు తా వారిమీఁద
నొనర నల్లక తిట్టకుండుటే శమము
అట్టినిర్మలశమం బతిశయంబుగను
బుట్టిసంతోషముల్ పొందించుఁ గనుక
సకలదుఃఖహరంబు శాంతగుణంబు
ప్రకటమోక్షద్వారపాలుండు గాన
నందరికన్న శాంతాత్ముఁడే ధన్యుఁ
డిందుకు సందేహ మించుక లేదు
అలవిచారం బెట్టిదన్నఁ జెప్పెదను
బాలుపొంద శాస్త్రంపుబోధచేఁ బ్రబలి
ఖ్యాతిగాఁ బూర్ణమై ఘనమైన బుద్ధి
చేతఁ గారణము సుస్థిరముగా నెఱిఁగి
ధర నటువలెఁ జేయఁదగుపను లెల్ల
పరుఁడు తానై సేయు బద్ధుండు గాఁడు
తిమిరమం దణఁగదు దీపప్రకాశ
మమరఁ గల్గిన పుట్ట దండంబులేక

యెంతటి మఱుఁగైన నెదురుగాఁ జూచి
సంతోష మిచ్చు విచారసందృష్టి
ధీర యీసువిచారదృష్టి సంధింప
నేరిచి యటమీఁద నే నను వాఁడు
ఎవ్వఁడు సంసార మెవరిది నేను
నెవ్వఁడనో యని యిచ్చఁ జింతించి
చిరమైన నిజయుక్తిచేతఁ దన్నెఱుఁగు
సరణి భావింప విచారమా దీని
భావింపఁ దద్వారపాలకుం డగును
గావున రామ! యీక్రమము భావించి
కాలగతులచేతఁ గదిసి కీడులును
మేలులు వచ్చిన మిడికి యుబ్బకయు
రెండును మది నొక్కరీతిగాఁ గనుచు
నుండుట సంతోష మోరామచంద్ర!
సంతోషమే సుఖసారమై యుండు
సంతోషమే మోక్షసౌఖ్యంబు దీనిఁ
బరికింపఁ దద్వారపాలకుం డగును
మఱియును విను రామ! మనుజుండు గర్వ
విరహితమతియై వివేకియై భోగ
నిరసనస్వాంతుఁడై నిస్పృహుం డగుచు
జృంభణ మొప్ప హెచ్చి యహంకరించు
డంబులఁ దర్కవాదములలోఁ జొరక

కోపతాపములను గుత్సితంబులను
జాపల్యగుణములఁ జాల వర్జించి
జయకాంక్ష జీవహింసల మాని భూత
దయగల పురుషుఁ డింపఱ శాంతమూర్తి
ఘనుఁ డట్టిసాధుసాంగత్యంబుఁ జేయు
మనుజుండు తరియించు మాయాంబునిధిని
గనుకను సాధుసాంగత్యంబు లోన
పనుపడి తద్ద్వారపాలకుం డగును
జిరముగా నిది యభ్యసించిన వారు
వరుసగా మోహార్ణవంబు దాఁటుదురు
స్పష్టంబుగాఁ బరబ్రహ్మోపదేశ
దృష్టాంత మీరీతిఁ దెలియఁజెప్పితిని
ధీరాత్మ! యిది యొక దేశసామర్థ్య
మారసి చూడు నీయంతరంగమున
నమర నిరాకార మగు బ్రహ్మమందుఁ
గ్రమముగా సాకారకల్పన దీఁగె
తగ దన దృష్టాంతదార్ష్టాంతరంబు

లగుచు నెప్పుడు ప్రమాదాంతంబు లగుచు
ధర నొప్పు మూర్ఖకుతర్కవాదములఁ
జొరక సదా పరిశుద్ధమై వెలుఁగు
శుద్ధచైతన్య మచ్చగ భావమందు
సిద్ధాంతముగ నెంచి చింతింపుచుండు

ధీర నీ వందుఁ బొందెద వని కరుణ
నారూఢుఁడైన సంయమి దృఢంబుగను
మొనసి రామునకు ముముక్షుప్రకరణ
మనువొంద బోధించె ననుచు వాల్మీకి
క్రమమొప్ప వినుపింపఁగా భరద్వాజుఁ
డమర శ్రీరాముని కావసిష్ఠుండు
మఱియేమి చెప్పె సమ్మతముగా నాకుఁ
దిరమైన దయతోడఁ దెలుపవే యనుచు
నడుగ భరద్వాజు నాత్మలో మెచ్చి
యడర వాల్మీకి యిట్లని చెప్పఁదొణఁగె
వినుము భరద్వాజ విజయరాఘవుని
గని వసిష్ఠుండు సత్కరుణ నిట్లనియె
ధరణీశ యుక్తియుక్తములైన వాక్య
సరణి బాలుండైనఁ జక్కఁగాఁ జెప్పె
నే నని భావించు నిజముగా నెంచు
మానలినోద్భవుండైన నయుక్త
వచనముల్ చెప్పిన వాంఛతో వినకు
మచలుండవై సత్యమాత్మ నూహించు
మాకాశజాఖ్యాన మాదిచేసికొని
ప్రాకటంబుగ దశోపాఖ్యానములను
నీకుఁ జెప్పెద నది నెళవుగాఁ దెలియు
మాకాశము నిజసూక్ష్మంబైన చోట

మొదట దోఁచకయుండి మూలవస్తువును
దుద నాత్మదృష్టికిఁ దోఁపింపుచుండుఁ
బొలుపొంద బ్రతిపత్తిభూతి వేదనలు
వలయుప మోక్షంబు నని చెప్ప నొప్పు
నీనాల్గునామంబు లెనయ జీవుండు
పూని సంవిత్స్వరూపము మించి దనరు
ఘనపదార్థజ్ఞానకలితుఁడై యిహము
నెనసి పురుషుఁడన నిం పొందు నతఁడు
పరఁగ సంకల్పాదిభావంబునందు
విరివిగా నుదయించి విపరీతమైన
జ్ఞానంబుచే మహాజలధితరంగ
ఫేనబుద్బుదములై పెంపొందినటులఁ
దానె ప్రపంచమై తగ వెల్గు చుండుఁ
గాని తదన్య మెక్కడఁ బుట్ట లేదు
ఆప్రపంచము బంధ మై యుండుఁ గనుక
నాప్రపంచము తనయం దణంచుటయె
ముక్తి యనంబడు ముక్తికి వేఱె
యుక్తి లే దిది మహాయోగి నిశ్చయము
మనుజేంద్ర! తద్దృశ్యమార్గంబు నీకు
వినుపించెదను నేను విశదంబుగాను
గలరీతిఁ దోఁచు జగంబు లన్నియును
విలయకాలములందు విరిసి నశించు

కల లన్ని యణఁగి చొక్కముగా సుషుప్తి
యలవడినట్లుండు నంధకారమును
జలజాప్తచంద్రనక్షత్రపావకుల
వెలుఁగు లెక్కడ లేనివేళఁ దా నొకటె
అవ్యక్త మచల మనాఖ్యమై నిండి
దివ్యచిన్మాత్రమే దీపించుచుండు
నలచిత్తునకు బురుమాత్రసద్బ్రహ్మ
మలఘుసత్తను మాత్ర మని యార్యజనుల
చేతను వ్యవహారసిద్ధికై వివిధ
పూతనామములఁ జెప్పట కొప్పు నతఁడు
చెలఁగి యన్యునిపోల్కి జీవాత్ముఁ డగుచుఁ
కలనాకవిత్తృసంకలితుఁడై చెలఁగి
మానసంబున మహామాయమై మించి
తానె సంకల్పబృందము లగుచుండు
మొనసి తత్సంకల్పమున నింద్రజాల
మనఁగ నొప్పుచు విశ్వమంతయుఁ బుట్టు
వనధివల్లఁ దరంగవారముల్ కనక
మున భూషణమ్ము లిమ్ముగఁ బుట్టుకరణి
సత్యమైనటువంటి సద్బ్రహ్మమందు
నత్యంత మీశ్వర మగునట్టి సృష్టి
మనమై ప్రకాశించి మాయాబలమున
మొనసి పృథగ్భావముగఁ గల్గుచుండు

సునిశితమైనట్టి సూర్యప్రకాశ
నము నెండమావులు మొనసి గన్పించు
కరణిఁ బరాత్మప్రకాశంబునందుఁ
బొఱపొరి విశ్వంబు పుట్టిన రీతి
ఘనతరోత్పత్తిప్రకరణంబు నీకు
వినిపించితిని మఱి విను మింక నొకటి
కర మర్థితోఁ బూర్వకాలమం దాత్మ
నరయ నాకాశమం దనఘవర్తనుఁడు
అలఘుఁ డాయుష్మంతుఁ డను విప్రుఁ డొకఁడు
గలఁడు మృత్యువు వానిఁ గదిసి గొంపోవ
వలె నంచు డగ్గఱ వచ్చి దా నతని
బలము తేజముఁ జూచి భయమొంది మదిని
దలఁచె నిట్లనుచు భూతంబుల నెల్ల
మెలవుగా నే దిగమ్రింగుచుందుదును
అటువంటి నాకు నీయనఘుండు
ఘటికుఁడై చిక్కఁ డెక్కడివాఁ డితండు
అని వితర్కింపుచు నంతకు కడకుఁ
జని మ్రొక్కి నిలిచి యాచంద మంతయును
వినుపింపఁగాఁ బ్రేతవిభుఁ డిట్టు లనియె
విను మృత్యుదేవి యావిప్రపుంగవుఁడు
ఆకాశజుండు మహానుభావుండు
నీకుఁ జిక్కఁడు తపోనిష్ఠ పెంపునను

నాయు వుండినవారి నదిమి చంపుటకు
నీయత్న మున్నదే నెఱి వారివారి
కర్మానుసారంబుగా గతాయువుల
నర్మిలిఁ గొనిపోదు వంతియే కాని
యేకర్మములఁ జేయ కిరవొందినట్టి
యాకాశజుని ద్రుంప నలవియే నీకుఁ
గోపతాపములచేఁ గ్రూరాత్ములైన
పాపకర్ములను జంపంగ నగుఁ బొమ్ము
అనినఁ దండ్రికి మ్రొక్కి యామృత్యు వడిగె
నన వసిష్ఠుని జూచి యారాముఁ డనియె
మునినాథ! యాకాశమునఁ బుట్టె విప్రుఁ
డనఁగ నాతఁడు బ్రహ్మ మని తోఁచె దాని
విశదంబుగాఁ జెప్పవే యన్న మౌని
దశరథాత్మజుఁ జూచి తగ నిట్టు లనియె
వసుధేశ! మృత్యుదేవత కగపడని
యసమానుఁడే బ్రహ్మ యగుఁ బృథివ్యాది
భూతవిరహితుఁడై పొసఁగి యాకాశ
మీతీరుగా నుండు నెల్లదిక్కులను
నారీతిగాఁ దా నిరాకారుఁ డగుచు
భూరిసంకల్పసత్పురుషుండు నయ్యె
నరయఁగా నతఁ డజుఁ డాదిమధ్యాంత
విరహితుం డాద్యుండు విమలుండు నగుచుఁ

గలలోన నొకవంధ్య గన్నపుత్త్రకుని
వలెఁ గల్గి తా దేహివలెఁ దోఁచుచుండుఁ
దెలిసితే పరమార్థదేహి గాఁ డనఁగ
నలరామచంద్రుఁ డిట్లనె నోమునీంద్ర!
యరయ భూతంబుల కాదివాహికము
తెఱఁ గొప్ప నాదిభౌతిక మన రెండు
తనువులు కల వావిధాతలు రెండు
నొనరంగ గలవొ లేవో యన్న మౌని
పలికె నిట్లని భూతపటలి కారణము
వలనఁ బుట్టఁగఁ దగ ద్వయము ఘటించె
ఘనకారణాత్ముండు గాక విజ్ఞాన
మెనయఁగా నాదివాహిసుఁ డయ్యె నజుఁడు
కనుక జీవుండు సంకల్పపురుషుఁడు
తనుతరచిత్తమాత్రస్వరూపుఁడును
వెలయు సృష్టిస్థితివిలయకారణుఁడు
మొలచు మనోరూపమును స్వయంభువును
తా నెయ్యె సృష్టి విస్తారంబు సేయుఁ
గాన నీతోఁచు జగమ్ము లన్నియును
మొనసి మనోమయంబుగఁ జూడు రామ!
యనిన మనోరూపమును నొంది దాని
సరణిఁ జెప్పు మటంచు జలజాప్తకులుఁడు
మఱవక నడుగ నమ్మౌని యిట్లనియె

జననాథ! విను మాత్మసంకల్పసరణి
మన మనంబడుఁగాని మది వేరె కలదె
సంకల్పజాలముల్ సంకీర్ణ మగుచుఁ
బొంకంబులై మనంబున నె వసించుఁ
గావున మదికి సంకల్పంబులకును
దావల మగును భేదము లే దవిద్య
యగు మనంబు మలంబు నంధకారంబు
నగుచు సంకల్పాఖ్య లగుచుండు వాని
వలన జగంబులు వర్ధిల్లుచుండుఁ
జెలువారి యవి నశించిన వేళలందు
గగనాదిభూతసంఘములు లయంబు
లగు నందుఁ జిన్మాత్ర మంతట నిండి
యగణితముగ నేకమై వెల్గుచుండుఁ
దగ జగద్విష్టయై దనరు నాత్మకును
నెనవుగా నీవును నేను జగంబు
లను దృశ్యసత్త యున్నట్టి వేళలను
దలకొని కేవలత్వము లేకయుండు
నలదృశ్యసంభ్రమం బణఁగినతఱిని
బ్రతిబింబరహితదర్పణముచందమున
హితమొప్ప ద్రష్టృత్వహీనమై నిండి
ఘన కేవలాత్మ యొక్కటి వెల్గుచుండు
మొనయు చిదాకాశమున మానసంబు

అనిశంబు తాన సదాకృతి యగుచుఁ
గను మూసి నిద్రించుకాలంబులందుఁ
గనిన స్వప్నంబులకై వడిగాను
బెనుచు లోకములను భేదరూపముల
నటువంటిలోకంబు లడఁగెడి వేళ
స్ఫుటముగాఁ గ్రమ్మఱఁ బుట్టెడివేళ
శాంతమై గ్రుంకని జలజాప్తకరణి
నంతట నవశిష్టమై నిల్చియున్న
యజరుఁ డనామయుఁ డాదిదేవుండు
నజుఁ డనంతుఁడు పరమాత్మ యీశ్వరుఁడు
సర్వకాలంబును శాశ్వతుఁ డగుచు
సర్వవిశ్వమును ముచ్చటగఁ జేయుచును
నన్నియుఁ జేసి సేయనివాఁడు నగుచు
పన్నుగా నంతట బరిపూర్ణుఁ డగుచు
నరయఁగా వాఙ్మనసాతీతుఁ డగుచుఁ
బరమమోక్షస్వరూపకుఁ డగుచుండు
నతనికి నాత్మముఖ్యాభిధానములు
ప్రతిభతోఁ గల్పింపఁబడు న దెట్లనినఁ
దొలుత వేదాంతవాదులు బ్రహ్మ మనుచుఁ
బొలుపొంద సాంఖ్యులు పురుషుండ యనుచు
విజ్ఞానవిదులు భావించి నిక్కముగఁ
బ్రజ్ఞాన మే నని పల్కఁగా మఱియు

శూన్యమతస్థులు శూన్యమే యనుచు
ధన్యమౌ శుద్ధచైతన్యంబునకును
నెనలేని నామంబు లీప్రకారముల
మొనసి కల్పింతు రామూలతత్త్వంబు
జలజాప్తచంద్రనక్షత్రపావకుల
కలఘుగ్రహంబుల కమితతేజములఁ
దా నిచ్చి వానిచేతను దాను వెలుఁగుఁ
గాన స్వయముగాఁ బ్రకాశత్వమునను
వెలిఁగి సూర్యాదుల వెలిఁగింపుచుండుఁ
బోలుపుగా స్రష్టయు భోక్తయు భర్త
ద్రష్టయు మతంబునై తా నన్నియెడల
నిష్టంబుగా నుండి యెచట నంటకయు
ఆరయ దేహస్థుఁడై దాని కెపుడు
దూరమై తానె చిత్తును సత్తు నగుచుఁ
బోలువుగా స్త్రీపున్నపుంసకలింగ
ములుగాక యింతకు మూలమై యుండు
అతని దేహంబునం దమితాబ్జభాండ
వితతులు పుట్టుచు విరియుచు నుండు
నాయనంతుఁడు విశ్వమంతయుఁ జేసి
సేయకయే నిర్విశేషమై యుండు
నని తత్త్వనిశ్చయం బారాఘువునకు
మన మొప్పఁ జెప్పి యమ్మౌని యిట్లనియె

యరయఁగా నిది యితిహాసపారంబు
పరమ మాకాశజోపాఖ్యాన మగును
ననుభవంబుగ దీని నాలించువార
లనఘ! జీవన్ముక్తులై సుఖింపుదురు
ఇలను జీవన్ముక్తు లెట్టివా రనిన
బలియు రాగద్వేషభయములు లేక
యాకాశమునుబోలె నత్యచ్ఛ మగుచుఁ
బ్రాకటంబుగ సన్నిపనులు చేయుచును
నెల్లకార్యములందు నేవేళ నాత్మ
చల్లనై తగునట్టి శాంతి వహించి
పొరిఁ బదార్థములందుఁ బూర్ణుఁడై గర్వ
విరహితుఁ డగుచు వివేకి యైనట్టి
వాఁడు నిక్కముగ జీవన్ముక్తుఁ డగును
బోడిమిగా నట్టి పుణ్యాత్ముకుండు
కాలవశంబునఁ గాయంబు విడిచి
వాలాయమైన జీవత్వంబు నణఁచి
పరమాత్మయందుఁ దప్పక పొందు నదియె
మురువుమీఱ విదేహముక్తి యటంచుఁ
బలుక నొప్పునటంచుఁ బట్టుగాఁ జెప్పి
పలికె నమ్ముని యీయుపాఖ్యానమందు
నలపరమాత్మమాయామనోరూప
కలితుఁడై జగములు గల్పించినట్టి

సరణి చెప్పంబడె సాత్వికమాయ
కిరవైన దుర్ఘటహేతుత్వమహిమ
మఱి జగత్తునకును మాయికత్వమును
దర మిడి యొఱుఁగంగఁ దగునట్టిలీల
చరితంబుఁ జెప్పెదఁ జక్కఁగాఁ దెలియు
మురు దది యెట్లన్న నాలించి వినుము

### —లీలోపాఖ్యానము.—

కమనీయసామ్రాజ్యకలితుఁ డనంగ
నమరెడు పద్మాఖ్యుఁడను మహీపతికి
నలర భార్యామణి యైనట్టి లీల
వలనొప్పఁగా సరస్వతిని బెక్కండ్లు
కడఁక నుపాసింపఁగా వాణి వచ్చి
పొడసూప లీల తెప్పున లేచి మ్రొక్కి
వినుతులు పెక్కు గావింప నవ్వాణి
వనిత నీ కిపు డేమి వర మిత్తు ననఁగ
నాలీల పలికె నా కన్న ముందుగను
దాళిమి లేక నాథవుఁ డొకవేళఁ
గప్పి తెప్పునఁ గాలగతి నొందెనేని
యొప్పి నాయింట జీవుం డున్నయట్టి
వర మీయు మదిగాక వరుఁడు దేహంబు
దొరఁగినతఱి నాకుఁ దోడుగా నీవు

వచ్చి నాపతిఁ బ్రోవవలె నన్న వాణి
మెచ్చి యిట్లనియె నోమెలఁత! నీవిభుఁడు
తనువు వీడినవేళఁ దడయ కాక్షణమె
పనిఁబూని సుమమంటపంబు గల్పించి
యందు నీపతి నుంచి యపుడె పుష్పములఁ
బొందుగాఁ బైనఁ గప్పుము దానఁ దనువు
కందక కుందక కాంతితో నుండు
ముందరఁ దత్ప్రాణములు వచ్చు మరల
బ్రదికి యీరాజు నీభర్తయై యుండు
నిది నమ్మియుండు మోయింతి యటంచు
నాలీల కెఱఁగించి యరిగె నవ్వాణి
మేలు గోరుచు లీల మెలవుగాఁ బతిని
గలసియుండఁగ నంత కాలంబు రాఁగ
నలపద్మభూపాలుఁ డంగంబు విడిచి
చనఁగ నాలీల పుష్పములమంటపము
పనిఁబూని నిర్మించి పతిదేహ మచటఁ
బెట్టి పైఁ బూలు గప్పించి కన్నీరు
పెట్టి వాణిని దాను బేర్కొనఁగానె
వచ్చి సరస్వతి వరపీఠమందుఁ
జెచ్చెరఁ గూర్చున్నఁ జేదోయి మొగిచి
కనుల బాష్పము లొల్కఁగా లీల భార
తిని జూచి పలికె నోదేవి! మద్విభుఁడు

యెచ్చటి కరిగెనో యెఱుఁగఁ దద్దేహ
మిచ్చట నుంచి నీ వెఱిఁగించినటులఁ
జేసితి నిఁక నేమి సేతు మత్పతిని
బాసి ప్రాణము లెట్లు ధరియింతు నేను
నని యేడ్చుచుండఁగా నాదరం బెసఁగ
నెనసిన నెనగుతో నిట్లనె వాణి
యోలీల! క్లేశంబు నుపసంహరింపు
కాల మెంతటివారు గడువఁగా లేరు
పుట్టినవా రెల్లఁ బోవుట నిజము
నెట్టనఁ దిరముగా నిల్వ రెవ్వరును
గలలవంటిది యీజగంబులరీతి
తెలిపెద నెల్లన్నఁ దేటగా వినుము
నానాశరీరముల్ నశియించి పోవు
నూని శాశ్వతముగా నుండు జీవుండు
ఆవిధ మెల్ల నీ వసుదుగాఁ జూడఁ
గావలసినఁ జూతు గాక నీ కిపుడు
తిరముగా జ్ఞానోపదేశంబు సేతు
నరసి భావించు చిత్తాకాశ మొకటి
యనుపమం బైన చిదాకాశ మొకటి
యొనరంగ నాకాశ మొకటి యిమ్మూఁడు
గల వివెప్పుడు నిరాకారంబు లగుచు
నలరఁగా నొండొంటి నంటక యుండు

మానితసంసారమంటప మందు
దానియం దొకశైలతటమున నొక్క
పట్టణంబున నిజభార్యతోఁ గూడి
పట్టుగా నొక్కవిప్రవరేణ్యుఁ డుండి
యలకొండక్రింద మహావినోదముల
బలముఁ జూపుచు నొక్కపార్థివేశ్వరుఁడు
అలరుచు సఖి! వేఁట లాడఁగాఁ జూచి
తలఁచె నిట్లనుచుఁ జిత్తమున నీరాజు
పగిది నెన్నఁడు భూమిఁ బాలింతు ననుచు
వగచి చింతను బొంది వాఁడందుఁ దనువు
పడవైచి పద్మభూపాలుఁడై పుట్టె
వడలుచు నతనిభార్యామణి మేను
బాసి లీలాఖ్యతోఁ బ్రభవించి నీవు
భాసురాత్మకుఁడైన పద్మభూపతికి
నిల్లాల వైతివి యిష్టభోగముల
నెల్లవారెఱుఁగ భూ మేలుచుండితిరి
మొనసి బ్రాహ్మణదేహములు మీరు విడిచి
యెనిమిదినాళ్ళయ్యె నిచ్చట మీరు
పొడమి డెబ్బదియేండ్లు భోగేచ్ఛ మీఱఁ
బుడమి నేలితిరి యిప్పుడు రాజు తనువు
వీడిన దినమందె విను పదాఱేండ్ల
వాఁడయ్యె నని మఱి వాణి యిట్లనియె

నావిప్రభార్య నీయటువలె నన్ను
వావిరి నర్చించి వరయుగళంబు
నడుగ నిచ్చితి విప్రుఁ డానాఁడు తనువు
విడిచియు నాయిల్లు వెడలిపోవుటను
గాన మీయిరువురి కాఁపుర మెల్లఁ
బూని బ్రాహ్మణగృహంబున నున్న దిపుడు
అరయఁ బున్నాగాతుఁడైన భూవిభుఁడు
గురుతరసంసారగోష్ఠి నీయింట
నిలిచియున్నది యని నిశ్చయంబుగను
బలుకఁగా విని లీల భారతి కనియె
నక్కడ జనని! బ్రాహ్మణవర్యుజీవ
మెక్కడ వచ్చి మాయింటిలోఁ జొచ్చె
వాఁ డేడ మే మేడ వనగిరుల్ దిశలు
నేడ నవెల్ల మాయింట నెట్లుణఁగె,
నిమ్మాట వచియింప నేల యిచ్చోట
నమ్మ యీవాక్యంబు లన్ని దబ్బఱలు
కుదురైన సర్పకోటరమందుఁ బిదపఁ (?)
బదపడి సురదంతి బంధింపఁబడియె
బలమొప్ప నణువులోపల నుండు సింహ
ములతోడ మశక మిమ్ముగఁ బోరి గెలిచెఁ
గమలబీజంబులోఁ గనకాద్రి యున్న
నమర భృంగము మ్రింగె ననినచందంబు

గా వచియింప కెక్కడిమాట లనఁగ
నావాణి లీల కిట్లనియె నెన్నఁడును
నే దబ్బఱాడను నీచేత నియతి
భేదనసేయ నభేద మాత్మీయ
మందిరమందు బ్రాహ్మణుని జీవాత్మ
పొందియున్నది యిది బొంకు కా దతివ!
యావిప్రుఁ డున్న మహారాష్ట్ర మాత్మ
భావింప గగనరూపం బగుఁ గనుక
గగనాత్మకుండై ప్రకాశించి యున్ని
యగణితుఁ డగుచుఁ దా నందుండి చూచు
నానాఁటి దేహంబు లందున్నతలఁపు
లీనాఁడు మఱచితి రిద్దఱియందు
మనముల వేఱె సంస్మరణముల్ పుట్టె
వనజాక్షి! జాగ్రదవస్థలు దలఁచు
తలఁపు లన్నియును జిత్తమున వసించి
కలలందు సుఖము దుఃఖమును జీవునకుఁ
బరిపరివిధములఁ బాపపుణ్యాను
సరణులఁ దోఁపించి జాగ్రదవస్థ
మరల వచ్చిన నందు మాయంబులైన
కరణిని మరణంబు గలిగినవేళ
బొందిలో మునుపుండి పుణ్యపాపముల
నిందుఁ జేసిన వెల్ల నెనసి వెన్నాడి

చనఁగ లింగశరీరసహితుఁడై స్వర్గ
మున మహాసుఖము నిమ్ముగ నారకముల
యందు దుఃఖము పూర్వ మవనిపైఁ గలలఁ
జెంది తా ననుభవించినచందములను
ననుభవించినమీఁద నవనిపై మరల
జనియించి పరలోకసౌఖ్యదుఃఖముల
మఱచుచు సంసారమాయలోఁ దగిలి
పరువడి పుణ్యపాపంబులే చేసి
చని పుట్టు నిటువంటి చావుపుట్టువులు
కినిసి జీవునకుఁ గల్గినచందమునను
గనిపించు విజ్ఞానకలితుఁడై పుట్టి
మనుజుల కని చెప్పి మరల నిట్లనియె
ముదితరో! సంకల్పముకురంబుపోలెఁ
గుదురు చిదాకాశకోశకోటరము
నందొప్ప నంతస్థనమై యుండు భూమి
యం దెన్నఁ బరమాణు వనఁ దోఁచు నాత్మ
యందుఁ దద్రూప మైనట్టిమనంబు
నందు సర్వజగంబు లద్భుతంబుగను
గనఁ బ్రతిభానాత్మకంబులై యుండు
నన విని లీల యిట్లనె సంశయమున
జనని! యావిప్రుండు చనిపోయె నేటి
కెనిమిదినాళ్ళంటి విచ్చట నాకు

నెన్నఁగా డెబ్బదియేండ్లయ్యె నిట్టు
లున్న కలఁకఁ దీర్చు మోతల్లి! యనిన
విని వాణి పలికె నోవిరిఁబోణి! నిజము
పనుపడ నాలించు ప్రతిభాసకన్న
నల దేశకాలముల్ హ్రస్వము దీర్ఘ
ములు లేవు చిద్రూపమునకన్న వేఱె
ప్రతిభాస లే దట్టి ప్రతిభాసవిధము
సతి విను మెట్లన్నఁ జంద్రచంద్రికల
కరణి భేదాభేదకలితంబు లగుచుఁ
బరమచిత్తును జిత్ప్రతిభాసలు వెల్గుఁ
జిత్తునఁ బ్రతిఫలించిన కారణమునఁ
జిత్తు జీవాత్ముఁడై సృష్టిలోఁ దగిలి
మరణమూర్ఛలఁ బొంది మదిఁ బూర్వసరణి
మఱచి క్రమ్మఱఁ బుట్టి మాయచేఁ జిక్కి
కలఁ గాంచి మేల్కొన్నకై వడిగాను
వలనుగా నన్యభావన నొంది తాను
నాధేయు మగుదు నా కాస్థూలదేహ
మాధార మనుచు దేహాభిమానమునఁ
దనకు వీరలు తల్లిదండ్రు లటంచు
గనిసి భార్యాపుత్రకులు నా రటంచు
మించి కొందఱు శత్రుమిత్రు లటంచు
నెంచి వివేకహీనుండైన నందు (?)

చేఁ బ్రపంచము దోఁచు సిద్ధమైనట్లు
నీప్రపంచము కల్ల యీ భ్రాంతు లెల్ల
విడువుము జీవుండు వివిధ దేహములఁ
బడవైచుచును బ్రాఁతబట్టల విడిచి
క్రొత్తబట్టలఁ గట్టుకొనినచందమునఁ
జిత్తవిభ్రాంతిచే జీర్ణంబులైన
తనువులు విడిచి నూతనశరీరముల
నొనరంగ ధరియించుచుండును వానికిని
నెందఱు తలిదండ్రు లెందఱు భార్య
లెందఱు నందను లెందఱు హితులు
శాత్రవు లెందఱు చర్చింప నీకు
మాత్ర మీపురుషుండు మగఁడయ్యె ననుచు
భ్రాంతినొందుచు దుఃఖపడక నీయాత్మ
నంతరంగంబునం దరసితి వేని
పొలుపార స్త్రీపున్నపుంసకలింగ
ములు గల్ల వాత్మ కిమ్ముగ నెన్నఁటికిని
గావున నీవు నిక్కము నెఱింగినను
నీవు స్త్రీయును గావు నెఱి పురుషుఁడవు
గావు నపుంసకాకారంబు గావు
భావింప నీకొక్కపతి లేఁడు నీవు
పద్మభూపాలునిభార్యవు గావు
పద్మాక్షి! నీ వట్టిభ్రాంతి వర్జించి

పరమాత్మ నే నని భావింపు మనుచుఁ
బరిపరివిధముల భారతీదేవి
చెప్పినఁ దనుఁ దా నె చింతించి లీల
యప్పు డిట్లనియె నోయమ్మ! గీర్వాణి!
నీవు చెప్పినరీతి నిశ్చయం బయ్యె
నావిప్రమిథున మున్నట్టి పజ్జకును
నను గొనిపొ మ్మన్న నగుచు నద్దేవి
మనమున భావించి మరల నిట్లనియెఁ
దరుణి యప్పరమచైతన్యచిద్రూప
సరణిని నీవు నిశ్చయముగా నాత్మ
భావించి తత్స్వరూపంబున నైనఁ
బోవచ్చు నావిప్రపుంగవుఁ జూడఁ
గావచ్చు నీస్థూలకాయంబుతోడఁ
బోవుట దుర్లభంబుగ నుండుఁ గానఁ
బరఁగఁ జిత్తస్వరూపమును ధరించి
తెఱఁగొప్ప నాదిభౌతికశరీరంబు
నారసి ధ్యానింప నపుడు మావంటి
వారి కెల్లను జిరవాసనచేత
బలవంతముగఁ గనంబడునట్టివాస
నలు తనుత్వము నొందినను శరీరమున
వనరఁగఁ దగ నాతివాహికం బగును
నన విని లీల యిట్లనియె నీజ్ఞాన

మొనసి నే సాధించు టెట్లొకో యనుచు
ననుమాన మొందఁగా నావాణి పలికెఁ
దనుమధ్య విను పరతత్త్వచింతనము

.... .... ....

ధన్యతాప్రదమగు తత్కథాశ్రవణ
మనోన్యబోధనం బతిశయశాంతి
పనుపడిన తదేకపరత యభ్యాస
మనఁబడు దృశ్యంబు లన్ని నశ్వములు
గా మదిఁ గని కర్మకారులందఱును
బామరు లని వారిపథములఁ బోక
యూరికె యుపశాంతి నొందినరీతి
నారూఢమైన బ్రహ్మానుసంధాన
సరణి యటంచు నిశ్చయముగాఁ జెప్పి
సరిప్రొద్దు వెళ్ల నిశ్చలతరజ్ఞాన
దేహంబులో భారతీదేవి దివ్య
దేహంబులో లీల దిగ్గున లేచి
గ్రక్కున గగనమార్గంబున కెగసి
యక్కజగాఁ బద్మజాండమండలము
పటుతీవ్రముగ నెడఁబాసి యాయిరువు
రటపోవఁగా నొక్కయద్రిపైఁ బురము
వేవేగ గని యందు విప్రమంటపము
భావించి యిరువు రాపంథను బోయి

అచట రెండవస్వర్గమందు బొంది కొని
ప్రచురమై తగుపూలపానుపుమీఁదఁ
బవళించియుండిన పద్మభూపాలు
శవముతో నొప్పిన సదనంబుఁ జేర
గాను దత్పతి వారిఁ గని మ్రొక్కి వాణి
నానందముగఁ జూచి యంఘ్రు లర్చించి
యందున్నఁ జూచి యిట్లనె వాణి నృపతి
పొందుగా నివుడు నీపూర్వజన్మములఁ
దలఁపు మటంచు మస్తకముపై హస్త
జలజంబు నిడఁగ నాజననాయకునకు
మనమునం దంటిన మాయ దొలంగె
ననఘుఁడై విజ్ఞానియై పూర్వజన్మ
సరణిఁ దాఁ దెలిసి యాశ్చర్యంబు నొంది
సరవి నహో మహాసంసారమాయ
గెంట నీదివ్యయోగినుల సత్కృపను
గంటి నంచు దలంచెఁ గరములు మొగిచి
పలికె నిట్లనుచు నోభామినులార!
వెలయుచుండిన మేను విడిచినదినమె
నాకు షోడశహాయనములయ్యె మఱియుఁ
బ్రాకటకార్యముల్ బంధుమిత్రాది
జనులును దోఁచిరి స్వాంతమం దనిన
విని వాణి యాభూమివిభున కిట్లనియె

అలవడు మోహామూర్ఛానంతరమునఁ
గలిగెఁ దత్స్మృతి నీకుఁ గలగన్నకరణి
నాలోకమును బాసి యరుగ ముహూర్త
కాల మాయింటిలోగా విచిత్రముగ
మఱియు వేఱే విభ్రమం బుదయించె
నరయఁగఁ గననిభయం బగు మనము
విను తగఁ వ్యవహారవిశ్రమ శ్రుతము
ననఁగ నొప్పఁగ నందు నలప్రతిభాస
పుట్టి షోడశవర్షములవాఁడ వైతి
విట్టిరీతిఁ దలంప నిలఁ గలయందుఁ
దగు ముహూర్తమున నబ్దశతంబు నైన
పగిదిఁ దోఁచుచునుండుఁ బటుమాయవలన
దానికై వడి జాగ్రత్భ్రాంత మిదియుఁ
గాని నిశ్చయమనఁ గారాదు నృపతి
యలపరమార్థంబునందుఁ బుట్టుటలు
పొలియుటల్ నీటిబుద్బుదవికారములు
నిరుపాధికుఁడ వీవు నిర్లేపనుఁడవు
పరమభోగస్వరూపకుఁడవు నీవు
అన్నియుఁ గనుచుందు వన్నియుఁ గనవు
నిన్ను నీ వెఱిఁగిన నీ కన్య మగును
గనిపించువస్తు వెక్కడనైన లేదు
దనర బాలకుఁడు భేతాళభూతమును

గని మరణాంతదుఃఖము నొందుకరణి
మనుజేంద్ర! యదిగాక మతి మరీచికలఁ
గాంచి మృగములు తత్కాంతి తోయముగ
నెంచి ద్రావను బరుగెత్తుచందమున
ననవరతం బసత్తైన ప్రపంచ
మును సత్తుగా నెంచి మూఢు లయ్యెదరు
సత్తుగా దీప్రపంచం బస త్తనుచు
నత్తఱి సకల వేదాంతమర్మములు
చెప్పి వీడ్కొని దివిఁ జేరి యాయిరువు
రొప్పగాఁ జూచుచు నుండి రంతటను
ఆవిదూరదుఁడు నం దాత్మతత్త్వమును
భావింప నంతలోఁ బరరా జొకండు
బలముతోఁ బద్మభూపాలునిమీఁద
నలిగి కయ్యముఁ జేసి యాతని వధించె
నప్పుడు వాని దేహంబులో నుండి
తెప్పున నొకసూక్ష్మ తేజంబు వెడలి
గ్రక్కున గగనమార్గంబున కెగరె
నక్కడఁ జూచుచున్నటువంటివాణి
పదపడి లీలతోఁ బలికె నిట్లనుచు
నిదె చూడవే లీల! యింతకు మున్ను
మనలతో భాషించు మనుజనాయకుని
బనిఁబూని యన్యనృపాలుండు ద్రుంచె

వాని తేజం బిదే వచ్చి యాకసము
నూని పై కెగరిపోవుచు నున్న దివుడు
చూడు మనుచుఁ జూపుచును వాణి లీల
తోడఁ బోవ విదూరదుని జీవరేఖ
రహిమీఱి సర్గపరంపరలందు
సహజంబుగాఁ బొంది చనిచని మఱియు
గురుతర బ్రహ్మాండకోటులయందు
మెఱయుచును బరిభ్రమించి యామీఁద
మరల దిగంబడి మహిమీఁద వ్రాలి
యిరవుగా మును పద్మఁ జేలినపురముఁ
జేరి యిల్లిల్లుఁ జొచ్చియును వెళ్ళియును
వారక పద్మభూవరునిమందిరము
గనుఁగొని యట కేఁగి క్రమ్మఱఁ బద్మ
మనుజేంద్రుతనువులో మాయగాఁ జొచ్చి
వెలుఁగ నప్పద్మభూవిభుఁడు నిద్రించి
కల గాంచి లేచినకై వడిగాను
ఆవులింపుచుఁ గన్ను లప్పుడు దెఱచి
లేవగాఁ జూచి యాలీల సంతోష
కలితయై భారతి ఘనమహామహిమ
తలఁచి నుతింపుచుఁ దత్ప్రతికడకుఁ
బోలఁగ కాశారదతోడఁ దా వచ్చి
నిలువ లీలను జూచి నృపుఁ డిట్టు లనియె

మానిని! యీపుష్పమంటపస్థళము
నే నెన్నఁడైనను నిర్మించలేదు
ఈలక్షణం బేమి యెఱిఁగింపు మనఁగ
నాలీల నడుచువృత్తాంతంబు లెల్ల
వినిపింప విని రాజు విస్మయ మొందె
ననుపమకరుణతో నానృపాలునకు
జ్ఞానోపదేశ మచ్చటఁ జేసి వాణి
పూని లీలను జూచి పొసఁగ దీవించి
గ్రక్కున సత్యలోకంబున కరిగె
నిక్కడ లీల నిజేశ్వరుఁ గూడి
యెనుబదివేలయేం డ్లిష్టభోగముల
ననుభవించుచు నుండి యట ముక్తులైరి
మానవేశ్వర! మనోమాయావశమున
నూని గనంబడుచున్న విశ్వంబు
పొలుపార లీనమై పోవుట జనులు
తెలిసికొందురటంచుఁ దేటగా లీల
కథఁ జెప్పి పీనినిక్కములన కవలి
కథ విను బ్రహ్మాదుఃఖాండచిన్మయము
పరిపూర్ణ మమలంబు భావనాతీత
పరమాత్మతత్త్వంబు భావింప నదియె
యచలమై సర్వదేహములందుఁ బొంది
ప్రచురనిర్వాతదీపముభంగి నుండు

నదె జీవకళయని యాత్మ భావించు
వదలక సంసారవాసన నదియె
గణుతికెక్కుచు నహంకారమై నిలిచి
యణు వల్ల సూక్ష్మమై యగ్నికణంబు
బహుకాష్ఠములఁగూడి ప్రభవింప నందు
బహువిస్ఫులింగముల్ ప్రభవించుకరణి
నాయహంకారాణువం దనేకములు
గా యహంకారాణుగణములు గలిగె
ఘనమైన యాద్యహంకారమే ప్రకృతి
యన మాయ యన మనం బనఁగా ననేక
నామరూపముల నానా ప్రపంచముగఁ
దా మించి వికసించి తన కాదియైన
పరమాత్మతత్త్వంబు భావింప నీక
మఱుఁగు తా నైనట్టి మానసమందుఁ
బొలుపుగా నీజగంబులు విస్తరించుఁ
గలలచందంబునఁ గనిపించు నణఁగు
నలజీవునకుఁ బరమాత్మ కైక్యంబు
గలిగినచందంబుగాను జీవాత్మ
చిత్తరూపము దాల్చి చేష్టింప నవలఁ
జిత్తంబు ప్రభవించి సృష్టి గల్పించె
సదమలచైతన్యసాన్నిధ్యపటిమ
నొదవి విశ్వముపుట్టు నుండు నటించు

నాపరమాత్మచే నణఁగ నెన్నఁటికిఁ
గాపట్యజగములే కలుగు లయించుఁ
గాన నంతటి కాదికారణ మాత్మ
దానిని నీవుగాఁ దలఁపు శ్రీరామా!

## కర్కటి కథ.

ఇపు డొకయితిహాస మేను జెప్పెదను
జపలత నొందక చక్కఁగా వినుము
అర్కకులేశ! యీయవనీతలమున
గర్కటి యనెడి రక్కసి గల దొకటి
యది మహీశైలోత్తరారణ్యములను
గదిసి చరింపుచుఁ గనఁబడినట్టి
జనుల ననేకులఁ జంపి భక్షింపు
చును దిరుగుచు మహాక్షుద్రాత్మయైన
పాపరాక్షసి పుణ్యపరిపాకకాల
మాపట్టణము గాఁగ నాహార ముడిగి
శాంతిచేఁ జీవహింసలు జేయ రోసి
యాంతరంగికదృష్టి నాత్మ భావించి
గనుచు వెయ్యేండ్లు నిష్కర్షగాఁ దపము
నొనరింప నటుమీఁద నొక్కనాఁ డజుఁడు
దానిచెంతకు వచ్చి తరుణి నీతపము
నేను మెచ్చితి శాంతి నిలిచె నీమదిని

కూడు విడిచిపెట్టి ఘోరతపంబు
నీడ చేయక లేచి యేఁగి యెందైనఁ
బాపకర్ములఁ జంపి భక్షింపు మనుచు
నాపద్మజుఁడు దాని కప్పుడు చెప్పి
చనియె నంత సమాధి చలియింప కతివ
పనిఁబూని నిర్వికల్పసమాధియందుఁ
దెగువ మీఱ ననేకదివ్యవత్సరము
లగణితమతి నుండి యట లేచిపోయి
యాఁకలి మునుపటియట్ల పుట్టఁగను
వీఁకతో మనుజుల వెదకుచు నొక్క
యడవిలో నడిరేయి నరుగుచు నుండి
విడిఁబడి మెకముల వేఁటాడి యందు
వచ్చుచున్న కిరాతవరుని దన్మంత్రి
నచ్చుగా నీక్షించి యార్భటింపుచును
బదరి పల్కెఁ గిరాతపతి! నిన్ను మైత్రి
నదిమి చంపి భుజింతు నాఁకలిదీఱ
అటుచావరేని నే నడిగినప్రశ్న
లిటమీఁదఁ జెప్పఁడ వెట్లన్న వినుఁడి
పాయక మితిలేని పద్మజాండంబు
లేయణువందుండు నింపుసొం పెసఁగఁ
గదిసి యనేకసంఖ్యలు బుద్బుదములు
వదలక యే మహావారిలో నుండు

నాది నవవకాశ మైన యాకాశ
మేది తా నరయఁగా నేమియు లేక
యుంచుక గలవస్తు వెయ్యది గలదు
చంచలసంసారసౌఖ్యంబు లనెడి
జాడల భరియించి చరియింపకున్న
వాఁడు నెవ్వాఁడు సర్వంబునం దెపుడు
ఘనముగా నుండియుఁ గడముట్టిచూడ
నొనర నుండక వెల్గుచుండు నెవ్వండు
ధరను జేతన నొంది తా నెవ్వఁ డయ్యె
నరయు నెవ్వఁడు మింట నద్భుతంబుగను
చిత్తగువును వ్రాసి చిత్రసర్గముల
సత్తైన సూక్ష్మబీజంబులో స్థూల
వృక్షం బణఁగినట్లు వివిధప్రపంచ
మక్షయ మగుచు నేయణువులో నుండుఁ
బ్రాకటంబుగఁ బృథగ్భావమై యెపుడు
నేకమై తగువస్తు వెయ్యది ద్రవము
నుదకంబు నొకటిగా నుండుచందమున
వదలక యే రెండువలెఁ దోఁచి యొకటి
యగుచు నుండెడి దెద్ది యని వితర్కించి
పగటుతో నడుగ నప్పడఁతివాక్యములు
విని భీతిలక జనవిభుఁ డాత్మమంత్రిఁ
గనుఁగొని దీనివాక్యముల కర్థములఁ

దెలుపు మటన్న మంత్రి వివేకయుక్తి
కలితుఁడుగానఁ గర్కటి కిట్టులనియె
నతివ రాక్షసి! మమ్ము నడిగిన ప్రశ్న
లతిరహస్యములు వేదాంతగూఢములు
కావునఁ జెప్ప శక్యంబు గాదైన
భావించి చెప్పెదఁ బట్టుగా వినుము
సదమలబ్రహ్మంబు సత్య మనంత
మది వాఙ్మనోతీత మాకాశనిభము
నగుచుండు నటువంటి యాత్మాణువందు
తగ నజాండములు విస్తారంబు లగుచుఁ
బొడముచు బుద్బుదంబులమాడ్కి నణఁగు
నడరార మఱియు నత్యద్భుతం బగుచుఁ
బ్రవిమలాకాశమై బాహ్యంబులేని
యవకాశమే చిన్మయంబు లౌచుండి
యద్వయంబై యిది యది యనరాదు
తద్వస్తుసంతతి దానసే గలిగెఁ
గ్రమ మొప్పఁగాఁ దత్ప్రకాశతవలన
నమరి చేతనుఁడైన యతఁడు భేద్యుండు
గనుక స్వశీలసంకలితుఁడై యుండె
ననుపమాత్మాకాశ మంది జగములఁ
దనతలంపుననె చిత్తరువుగా వ్రాయు
ననఘాత్ముఁడై నట్టి యతనితలంపు

వలననే సర్వవిశ్వము దోఁచెఁ గనుక
వెలయు నీవిశ్వంబు వేఱుగా దన్ని
తానె యగుటఁ జేసి తన కన్యవస్తు
వేనాఁటికిని గల్గ దింత కాశ్రయుఁడు
నగువాఁ డొకఁడు నిశ్చయంబుగా నుండు
నగణితసద్రూప మగుచుండుఁ గనుకఁ
బరమాత్మ గలఁడని పండితోత్తముల
చిరతరప్రజ్ఞతోఁ జెప్పఁగా నొప్పు
నని మంత్రి కర్కటి కాత్మనిశ్చయము
వినిపింప నది వాని వినుతించి యతని
దొరను సంతోషంబుతోఁ జూచి నీవు
నెఱిఁగినరీతి నా కెఱిఁగింపు మనఁగ
విని యమ్మహీపతి వేడ్కగా దానిఁ
గని యిట్టు లనియె నఖండయుక్తులను
వినవె కర్కటి! సర్వవిశ్వంబు మిథ్య
యని యెఱింగిననె మహాత్మునిఁ దెలియ
వచ్చు సంకల్పవివర్జితుఁడైన
హెచ్చుగానే స్వామి నెద నుంచవచ్చు
మెఱయ నేస్వామి యున్నే మనిమేష
సరణి నంతయుఁ బుట్టి సమయుచు నుండు
ఘననిగమాంతవాక్యంబు లేదైవ
మును గొప్పగా నెంచి మొనసి నుతించు

గురుతర బ్రహ్మాండకోటుల నిండి
తిరముగా నుండి యే దేవుండు దృష్టి
విషయంబు గాక యే వెలుఁగుచు నుండు
ఝుషఘష లేక చరాచరమ్ములును (?)
లలిని నే దేవులీలను బ్రభవించి
బలిసి వర్తిలు నదే బ్రహ్మమా నింతి!
విశ్వాత్ముఁడై సర్వవిశ్వంబుఁ జేసి
విశ్వంబు తాన యై విశ్వంబుఁ గనుచు
విశ్వేశ్వరుండన వెలుఁగుచున్నట్టి
శాశ్వతాత్మబ్రహ్మ సన్మాత్ర సత్య
వాక్యార్థమును నీవు వరుసగా నడుగ
నైక్యానుసంధాన మబ్బె మాకనుచుఁ
బలికిన సంతోషభరితాత్మ యగుచు
నలరి కర్కటి యిట్టు లనియె నో నృపతి!
యహహా మీవాక్యంబు లమృతతుల్యములు
సహజసుజ్ఞానభాస్వరములు గాన
మీరు పుణ్యాత్ములు మీదయఁ జ్ఞాన
మారూఢమై సంశయములఁ దీర్చినది
యానంద మొదవె నది విని యనుడు (?)
దాని కిట్లనియె నో దానవి! నీవు
పనిఁబూని వికృతరూపము మాని సౌమ్య
తనువుతో వచ్చి మాస్థలమున నుండు

సతి నీకు వస్త్రభూషణముఖ్యవస్తు
వితతుల నిత్తు మాపీడులయందుఁ
జరియించుచున్న రాజద్రోహమతులఁ
బరఁగుచోరుల మహాపాపకర్ములను
జెనఁటులఁ జంపి భక్షించుచు నుండు
మని చెప్పి మంత్రితో నానృపాలుండు
తనగృహంబున కేఁగెఁ దదనంతరమున
జనపతి చెప్పినసరణి దప్పకయె
తనపూర్వదారుణతను వందు వీడి
ఘనసుందరాంగియై గంధమాల్యములు
చేలభూషణము లిచ్చిన ధరించుచును
మేలిమి నానృపుమేడలం దుండు
పాపకర్ములఁ జంపి భక్షించికొనుచు
నాపట్ల నుండక యరిగి హిమాద్రిఁ
జేరి యందు సమాధిఁ జేసె నటంచు
నారామచంద్రున కావసిష్ఠుండు
పనుపడ కర్కటి ప్రశ్నోత్తరముల
మన మొప్పఁగాఁ జెప్పి మరల నిట్లనియె
జనవర! నీకును సంసారసుఖము
తనియ కున్నట్టి చిత్తవిలాసమునను
గలుగు రాగాదివికారదోషములఁ
జెలువార్చి రోసినచి త్తమే మరల

విమలమై సంసారవిభ్రమ మెక్క
సమయ మందఁగక చపలించెనేని
తెప్పున సుజ్ఞానదృష్టి సంధించి
యప్పు డాచాపల్య మణఁచుచు నుండు
నినతేజ! యిఁకనొక్క యితిహాస మేను
వినుపింతు నెట్లన్న విమలచిచ్ఛక్తి
సువిలాసమున మనుజులనిశ్చయంబు
ప్రవిమలంబై జగద్భ్రాంతి నణంచు
అది యెట్లనినఁ జిత్త మునఁ బాయకుండుఁ
బోదు ప్రపంచమున్ భూతముల్ గాంచి (?)
వెఱచుచున్నటువంటి వేళ గురుండు
సరసాత్మ యిది ప్రపంచవినాశ మనుచు
భయము నొందకు మీప్రపంచంబు బ్రహ్మ
మయమని చెప్పఁగా మది భీతి విడిచి
యరసి చిత్తాగ్భకుఁ డానంద మొందు
కరణి నీ కిఁక నొక్క కథ వినిపింతు

## -ఇందుపుత్రోపాఖ్యానము.-

నది యెట్లనిన నిందుఁ డను భూసురుండు
కదలక సతితోడఁ గైలాసమందుఁ
బరమేశుఁ గూర్చి తపముఁ జేసి శివుని
వరమునఁ బదిమంది వరపుత్రకులను

గాంచి కొన్నాళ్లుండి కాలవేగమునఁ
బంచత్వమును బొంది పడిపోవ నతని
సతి యగ్నిలోఁ జొచ్చి సమయఁగా వారి
సుతు లందఱును జూచి శోకించి తాము
నేయఁగాఁ దగుక్రియల్ చేసి యామీఁద
నాయగ్రజునిఁ దమ్ము లందఱుఁ జూచి
తల్లిని దండ్రిని దలఁచి బేర్కొనుచుఁ
దల్లడింపుచు నేడ్చుతమ్ములం బిలిచి
యేల యేడ్చెదరు మీ రెంత యేడ్చినను
జాలిచే జనకుండు జనని క్రమ్మఱను
వచ్చి మీశోకంబు వారింపఁగలరె
యిచ్చట వగవక యేమైన వరము
లరలేక మీరు న న్నడుగుఁ డటంచుఁ
గరుణ మీఱఁగఁ బల్కఁగాఁ దమ్ము లనిరి
యన్న గోపుగనూరి యధికారికొలఁది (?)
యున్నంతపదవి మా కొసఁగు మటంచు
నడుగఁగా నది స్వల్ప మది మీకు వలవ
దడర నింకేమైన నడుగుఁ డటంచుఁ
బలుకఁగా సామంతపదవి మా కొసఁగు
మలయ కిప్పు డటన్న నది యేటి పదవి
యిఁక మఱేమైన నే నిచ్చెద ననినఁ
బ్రకటమై తగు రాజపదవి నిమ్మనిన

విని యది మీకేల వేఱె వరంబు
మొనసి నన్నడుగుఁడిమ్మగ నన్నవారు
సకలరాజన్యశాసనుఁడైన నృపతి
యకలంకపద మియ్య మనఁగ నవ్వరము
ఆరాజపద మేల యని నింద్రపదము
గౌరవంబుగ వేఁడఁగా నతం డనియెఁ
దగఁ బ్రజాపతికి సిద్ధముగా ముహూర్త
మగు వేళఁ జెడిపోవు నయ్యింద్రపదవి
కావున మీ రది కాంక్షింపవలదు
వేవేగ నడుగుఁడీ వేరొక్కవరము
అనవుడు వారుకల్పాంతరంబులను
ఘనమై లయింపనిగతి నీయు మనిన
నాయగ్రజుండు కల్పాంతరంబులను
మాయక వెలుఁగు బ్రహ్మపదంబు మీకు
నిచ్చెద ననఁగ నదేరీతి మాకు
హెచ్చుగాఁ బ్రాపించు నెఱిఁగింపు మనిన
దయను దజ్జ్యేష్ఠుండు తమ్ములం జూచి
నయముగా నిట్లనె నానాజగములఁ
బుట్టించు బ్రహ్మను బుద్ధిచేఁ జిక్క
బట్టి ధ్యానించి తత్పద మందవచ్చు
నని చెప్పి తమ్ముల నందఱఁ దోడు
కొనిచని యొకదిక్కు గురుశుచిస్థలిని

జేరి పద్మాసనాసీనులై బ్రహ్మ
నారాధిగా చిత్తమందు భావించి
యమరులఁ బుట్టించునటువంటి బ్రహ్మ
లము తా మనుచు నిశ్చలత్వంబు నొంది
తముఁ దామె చూచుచుఁ దప మాచరింప
నమితమా వర్షశీతాతపవాత
ములచేతఁ దద్దేహములు నాశ మొందె
నలఘుదివ్యాంగంబు లాపదినుంది
ధరియించి తాము విధాతలై వేఱ
పారిపారి జగములఁ బుట్టింపఁ జూచి
మొదటిబ్రహ్మైశ్వర్యమును బొంది తలలు
కదలించి యూఁచె నీక్రమముఁ బాటింపఁ
జిత్తమే కర్తయ్యె సృష్టి కంతటికిఁ
జిత్తమే జీవుఁడై చేష్టింపుచుండు
నది యెట్టు లనిన బ్రహ్మలమని వారు
పదిమంది చిత్తముల్ పట్టి భావించి
భావనాసిద్ధియే బ్రహ్మలై దేహ
భావన మఱచి రో పార్థివాధీశ!
దేహవాసనలఁ బొందిన దేహి మరల
దేహమే దాల్చు ముక్తిని బొంద లేఁడు
ఆత్మవాసన నొందినటువంటి దేహి
యాత్మయం దైక్యమా నని వసిష్ఠుండు

చెప్పిన నూహించి శ్రీరామచంద్రుఁ
డప్పు డిట్లనియె దేహమున కందున్న
జీవునకును వేరు సిద్ధమై యుండు
నావిధంబుగ నుండినప్పటికైనఁ
గాయంబు సుఖము దుఃఖంబు జీవునకు
నాయాయెడలఁ గల్గిన ట్లుండకున్నె
హితవు మొప్పఁ జెప్పు మునీంద్ర! యటంచు
నతిభక్తితో రాముఁ డడుగ వసిష్ఠ
మౌని యిట్లనియె నో మనుజేంద్ర! దీని
కే నొక యితిహాస మెఱిఁగింతు వినుము.

కృతమేంద్రోపాఖ్యానము.

అరయ నింద్రద్యుమ్నుఁ డనువాని భార్య
మెఱయుచుఁ దగుపైఁడి మేడపై నుండి
యొకవీథి నొకచోట నొకవిటకాని
సుకుమారదేహుని జూచి మోహించి
కలయఁ గోరుచు నుండఁగా నానృపాలు
కొలువులో నితిహాసకుఁడు చేరి మదిని
దలఁచి ప్రాస్తవోచితంబుగా మున్ను
బలభేది గౌతముభార్యను గూడి
చనిన వృత్తాంత మాజననాయకునకు
వినిపింప నది తాను విని రాజపత్ని

తనమది నిటు తాను దలఁచె నహల్య
మొనసి యింద్రుని బొందె మునిని వంచించి
యటువంటి పెద్ద లట్లై రఁట పూర్వ
మిట పాపభీతి నా కేల యహల్య
నే నేను విటకాఁడు నిర్జరేశ్వరుఁడు
గా నిర్ణయించి యాఘనుని బొందెదను
నా కేమిభయ మని నడిరేయి పోయి
జోకగా మును తాను జూచినవిటుని
గలిసి వేడ్కల నుండఁగాఁ బొంచిపొంచి
వలనుగాఁ దలవరుల్ వారి నిద్దఱిని
గనుఁగొని దండించి గ్రక్కునఁ దోడు
కొనిచని యొకదిక్కు కూర్చుండఁ బెట్టి
క్షితిపతి కావార్త చెప్పిన లేచి
యతిభీషణాకారుఁడై వారిఁ జేరి
వారక కొట్టింపఁగా వారు మోహ
పరవశులై మోహబాధ లాత్మకును
దోఁచగ నందుఁ బొందుకు నొండొరులను
జూచుచుఁ బలుమారు చొక్కుచు హావ
భావవిలాసవిభ్రమవికారములఁ
గావింపఁ జూచి యాగ్రహముతో నృపుఁడు
కొంకక మఱిమఱి కొట్టింప నగుచు
శంకింప కిరువురా జనపతిం జూచి

పలికి రిట్లనుచు భూపాల మామైత్రి
తెలియక కొట్టించితివి శరీరములఁ
గోయించినను నొప్పి కోపంబు భయము
కాయాభిమానంబు గలుగ దెట్లనిన
సరసమా దేహవాసన నెడఁబాసి
పరమనోవాసనావశులమై కలసి
యుండఁగా నీ విప్పు డొట్టిదేహముల
దండించి కొట్టింపఁ దగ దదెట్లనినఁ
జిత్తమే హేతువౌ సృష్టి కంతటికిఁ
జిత్తంబు లేకయే సృష్టి యెటగును
నారయ భూజలతాదులఁ జగము
సారెకు వత్తి రసంబై నకరణిఁ
దనువులయందుఁ జిత్తము ప్రకాశించి
తనియక పను లిట్లు తానె గావింపఁ
గాను జడములైన ఘటముల నీవు
పూని కొట్టించినఁ బోవునే కినుక
తను వణంగినను జిత్తము దేహశతము
లను దాల్చు విడుచు మూలములఁ దా నిల్చుఁ
దాఁ దాల్చి విడిచిన తనువులకొఱకుఁ
దాఁ దాపపడునె చిత్తం బెడనైనఁ
జిత్తధర్మముల లక్షించి నీ వెఱుఁగు
మి తఱి నీకోప మేల నీ కనిన

విని వారి నాయూరు వెళ్ళఁగొట్టించి
మనుజేశ్వరుండు సమ్మతిఁబొందె నంత
వా రిద్ద ఱలిగి యవ్వలఁ గోర్కెతీఱఁ
గూరిమితోఁ గూడి కొన్నియేం డ్లుండి
తనివొంది యటమీఁదఁ దనువులు విడచి
మొనసిన సుజ్ఞానమున సిద్ధులైరి
యని చెప్పి మరల నిట్లనె వసిష్ఠుండు
జననాథ! వినవయ్య సకలదేహులకు
నరయఁగా రెండు దేహము లుండు నందుఁ
దెలియఁగొప్పఁగా మనోదేహంబు శీఘ్ర
గతిచలనంబు నాక్రమముగా స్థూల
మతిశవమాంసమయంబుగా నుండు
నన విని రాముఁ డిట్లనె నోమునీంద్ర!
మనము జడంబును మఱి యమూర్తమును
బొరిని సంకల్పప్రభూతమై యుండి
ధరను దేహము నెట్లు ధరియించియుండు
నన వసిష్ఠుం డిట్టు లనియె నోరామ!
విను మనంతంబును విమల మద్వయము
నచలంబు నగు పరమాత్మసంకల్ప
ఖచిత మేమనఁ గనంగా నొప్పుచుండి
తిరముగా బ్రహ్మోపదేశమా నొక్క
సరసేతిహాస మాశ్చర్యంబుగాను

